నెంతో మనోహరముగ వివరించి యున్నవారు. వీని నొక్కదానినైన భారతి పేర్కొనెనా? వీనిలోను వ్యాఖ్యలోను నొక సుగుణమైనను భారతికంటికి గోచరింపక పోయెఁగా. అన్నియు భారతికి నింద్యములే యయ్యెను. ఇదియా సువిమర్శలక్షణము?

భారతి చేసిన విమర్శమునకు బదులు వ్రాసెదరా యని నేను వారికి వ్రాయఁగా వారట్టి తలంపు తమకు లేదనియుఁ దమ వ్యాఖ్యానమునందలి దోషములను జూపినందులకుఁ దమరు భారతియెడఁ గృతజ్ఞులై యున్నామనియు వ్రాసిరి. వీరు పరమ శాంత స్వభావులు. వాస్తవముగ వినయసంపత్తి కలవారు. ఒరులు తమ్మెంతదిట్టినను బదులు చెప్పక యోర్చియుందురు. మఱియు మనంబునను వారిపైఁ గినుకఁ బూనరు. ఇట్టి యుదారగుణులగు పండితశిరోమణులు భారతి వ్రాసిన దానికి బదులు వ్రాయమి వింతగాదు.

"తెలిసినదానిని వ్రాసితిఁ
దెలిసిన దని తలఁచి వ్రాసితిం దెలియక నా
తెలియమి వ్రాసిన నలుసులఁ
దెలి పెదరని తలఁతు లెస్స తెలిసినవారిన్"

అని వ్యాఖ్యాతగారు వ్రాసినదానిచే వీరిగర్వరాహిత్యము నార్యపండితులయెడ వినమ్రతయుఁ దమదోషములఁ దెలుపువారియెడలఁ దాము కృతజ్ఞులై యుందురను భావంబును స్పష్టమయ్యెడు. ప్రమాదము లెవ్వరికి లేవు? భారతి విశేషించి పొగడిన మనుచరిత్రమునందు

క. వానికిఁ బురూరవుఁడు ప్ర
జ్ఞానిధి యుదయించె సింహసదృశుఁడు తద్భూ
జానికి నాయువు తనయుం
డై జగడై నతండుగనె యయాతినరేంద్రున్.

అనియున్నది. ఇచ్చట నాయువునకు యయాతి తనయుండని పెద్దనార్యుఁడు చెప్పినది పొరపాటు. ఆయువునకు నహుషుఁడు పుత్త్రుఁడు. నహుషునకు యయాతి పుత్త్రుఁడు. పెద్దనార్యుఁడు వ్రాసినది పొరపాటని వ్యాఖ్యాతగారు నలువది సంవత్సరములకు మునుపే కనుంగొని తమ పుస్తకములో

"తద్భూజానికి నాయువు తత్సుతుఁ
డౌ నహుషుఁ డతండు గనె యయాతినరేంద్రున్."

అని పద్యమును సవరించి వ్రాసికొనియున్నట్లును నాకొక్కసారి వారే చెప్పియున్నారు.

"మదిరాక్షి" అను శబ్దమునకు మల్లినాథసూరి వ్రాసిన యర్థము తప్పని దుర్గాదాసద్వివేది యను పండితుఁడు సాహిత్యదర్పణము తృతీయపరిచ్ఛేదము 267 శ్లోకమునకుఁగల వ్యాఖ్యకుఁ దిప్పణము వ్రాసి (195పుట) వేఱొకయర్థము నిచ్చియున్నారు. ఇదియు వ్యాఖ్యాతగారే నాకుఁ దెలిపిరి. ఇట్టి వెంకటేమహనీయులయెడలను స్ఖాలిత్యములు సంభవించుట కలదు. ఇఁక భారతివిమర్శనమునకు సమాధానములు వ్రాసెదను.

ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునఁ గల మాతృకలను జూచియే దంపూరు వేంకటసుబ్బాశాస్త్రులు సనప్పాకము శ్రీనివాసాచార్యులు వేదము వేంకటరాయశాస్త్రులు మున్నగు పండితోత్తములు పాఠములను నిర్ణయించి తమ టీకాకావ్యమును ముద్రింపించి యుండుటచే వెండియు వానినే చూచుటయందుఁ బ్రయోజనము లేదు. మఱియు నపపాఠములే మెండుగాఁ గానంబడును.

భారతిచూపిన పాఠములు సమంజసములు కావు. కావుననే పూర్వోక్తపండితులు వానిం ద్యజించిరి.

ఆత్మవక్షోమణివేది నిద్దపుఁ గాంతిఁ దనర్చుచున్న దనుటకంటెఁ గౌస్తుభము నిద్దపుఁ గాంతిఁ దనర్చి యనుటయే సరసము.

లక్కాంబిక - ముద్రితాదర్శములలో నన్నింట నిట్లే యున్నది. ఆపేరు బుక్కాంబిక యని యుండవచ్చును. లక్కాంబికయైన నుండవచ్చును. లక్కాంబిక యని యాదర్శములలోనుండు పాఠముఁ గూర్చి యీపేరు పొరపాటుగా నుండవచ్చు నని తోఁపఁగలదా?

రాధాతనయా — ఈపద్యములో — నిపుణాకరణకేయనకున్-యనుకమును బరికించినచోఁ గరపదయానకున్- అనుపాఠమే సరియని భారతిచెప్పుచున్నది. యానకున్- అనునక్షరవ్యావృత్తి చాలదా. పదయానకున్-అను

పాఠము స్వీకరించినచోఁ గ్లిష్టార్థకల్పనము చేయవలసి యుండును. కావున దానిని పాఠాంతరముగా వ్యాఖ్యాత గ్రహించుటయే సరి. వే. వేంకటరాయశాస్త్రి ప్రభృతి పండితులు దీనినే గైకొనిరి. దీనికిఁ దరువాతి పద్యములలోఁ "సుమాళునకుఁ" "సంభారునకుఁ" అనియు, 'జలధికిఁ' 'గృహాంగణనిధికిఁ' అనియుఁ 'బ్రవీణునకుఁ' 'కృపాణునకుఁ' అనియు 'నారణికిఁ' "ధోరణికిఁ" 'నాయకమణికిఁ' అనియు నొక్కొక్కపర్ణమున కీవ్యావృత్తి కన్పట్టెను.

ఈపద్యములో 1-8 పాదములలో నొకతీరున యమకము గలదని భారతి వ్రాసెనుగాని వీనిలో యమకము కన్పట్టదు.

కూలముద్రుజ — ఈ పాఠమునకంటెఁ 'కూటమూర్ధజ' యను పాఠము గైకొనఁదగిన దని భారతి సూచించెను. శోభగుణ భాసురంబును సరసార్థ విలసితంబును "కూలముద్రుజ" యను పాఠమునకంటెఁ 'కూటమూర్ధజ' యను పాఠము భారతి కిష్టమైన నగుంగాక. దానికి (భట సామజహయముల) కూట — సమూహముల యొక్క, మూర్ధజ — తలలనుండి పొడమెడు, క్షతజ — నెత్తురు, అని యర్థము చేయవలయును. అట్లయిన గజ తురగాదుల తలలనుండే కృష్ణరాయలు కొట్టి నెత్తురులు ప్రవహింపఁ జేసె ననియు ఎంచి యితరాంగములపైఁ గొట్ట లేదనియుఁ జేర్పవలెను. యుద్ధములో శత్రువుల శరీరముల నంతటను గొట్టుటయును సంభవట యును గలవు కాని తలలనుండె కొట్టెదురనుట యెంత చమత్కారముగా నున్నదో విచక్షణులు నిర్ణయింతురు గాక. అదియుఁగాక 'మూర్ధజ' — అను పదమునకు సాధారణముగా వెండ్రుకలను నర్థము గలదు గావున నదియే తొలుత స్ఫురించును. అది యిప్పటఁ బొసఁగమిచేఁ బైయట్లు యోగికార్థ కల్పనము చేయవలసి యుండును. సుశబ్దమగుటచేఁ గాళిదాసుఁడు మొదలగు మహాకవులు దీనిం బ్రయోగించి యున్నారు.

'మదోదగ్రాః కకుద్మంతస్సరితాం కూలముద్రుజాః
లీలాఖేల మనుప్రాపు ర్మహోక్షాస్తస్య విక్రమమ్.'
—రఘువంశము, 4 స. 22.

ఘనతాయవతారక — "తారక" అని యుండవలెనియుఁ బద్యమునందలి యమకమును గుర్తింపమిచేఁ గలిగిన దోషమిది యనియు దీనికి వ్యాఖ్యానము సరిగా లేదనియు భారతి చెప్పుచున్నది. సరియైన యర్థమేదియో భారతి తెలుప లేదు. యమకమును గుర్తింపని దోషము ప్రాచీన పండితుల కందఱకును వేదము వేంకటరాయశాస్త్రులవారికిని గలుగుటచే వారికింబోలె వ్యాఖ్యాతకు నీదోషముండిన నుండుంగాక. ఈపద్యమున యమకము లేదని మాత్రము చెప్పక తప్పినది కాదు.

నలుపు — నలువు — అని యుండవలయునని భారతి వచించెను. అది ధాతూద్యోతక శబ్దము కాదు. తక్కిన పాదములలో ద్యుతి ద్యోతక పదములు ప్రయుక్తములు. కేశవర్ణనమునందు వింతినలు పనినచో సరసముగాని నలుపనిన సారస్యము లేదు.

అక్కాంతి — ఏకాంత అని యుండవలయునఁట — ఏకాంత గృహంబుఁ — అనుటలో సారస్యమేమి? క్రోధాగారమే యేకాంత గృహమనినచో నద్యేకాంత గృహంబుఁ. అని యుండవలదా. ఆ పాఠము నంగీకరించినచోఁ బద్యమునందలి వాక్యమునకుఁ గర్తృపదమేమి? సత్యభామ యను పదము నధ్యాహారము చేసికొనవలయుఁ గదా. అది సరసమా! అట్లు నేఁడి తిమ్మన వ్రాసియుండునా?

నల్లడంబు నారసి — నలుఁగడలను వెదకుట యేలొకో? ఇటునటు కనుంగొనునపుడే కృష్ణుఁడు సత్యభామకుఁ గన్పడఁడా!

బాష్పకణికా — కళికా అను పాఠమే భారతి సమంజసమనుచున్నది. "కన్నీటిబొట్టు క్రిందికి జారునది మొగ్గవలె పోగదనము గలిగియుండు." నగుట కారణమఁట. నీటిబొట్టు కంటినుండి జాఱునపుడు బొట్టువలె నుండక మొగ్గవలెనుండునా? ఒకవేళఁ గంటినుండి క్రిందికి జాఱినపిదపఁ గన్నీరు మొగ్గవలె నున్నదని యొప్పుకొన్నను గంటిలో నున్నపుడు మొగ్గవలె నుండదు కదా. కంటిలోని బాష్పజల బిందువులచే లోచనములు తరళీకృతము లయ్యెనే కాని బహిర్గతములైన పిదపఁ గళికా

కారము దాల్చిన బొమ్మములచే లోచనాంతములు తిరళీకృతములు కాకేరవు గదా. కావున బొమ్మకణికా— అని వ్యాఖ్యాతగారు సవరించిన పాఠమే సరసము.

నిన్నఁ బాసితివనో—చనెనో అని యుండఁ దగునని యీ నరకాసుర యుద్ధము వృత్తాంతము సూచించునన్న ఎక్కుడు సరసముగా నుండునని యు భారతి చెప్పెడు. చననో. అనునది తద్ధర్మార్థక రూపము. కాలత్రయ బోధకము. భావి యుద్ధమును సూచించుననుటయే చమత్కారమని పలుకుదురు సహృదయుల యభిప్రాయము. ౩-౪౯ చని-అని అని యుండవలయునని భారతి చెప్పుట సరియే. చని యనుట యచ్చుతప్పిదపాటు. దీనిని వ్యాఖ్యాత సవరించియు పెండియు ముద్రాపకులు సవరింపరైరట. కావునఁ బద్యముల యకారాది సూచికలో "అని" యని సవరింపఁబడియున్నది. దానిని భారతి చూడలేదు. ఆక్షేపించు నూహయే దానికిం గలదుకదా.

జాజిపువ్వులు—కాజిపువ్వులు-అను పాఠము మంచి దని భారతి వచించెడు. కాజిపువ్వులు ప్రసిద్ధములు కావు. కావుననే వేదము వేంకటరాయ శాస్త్రులుగారు జాజిపువ్వులను పాఠమే స్వీకరించిరి. (చూ-వ్యాఖ్య.)

తరుణ గోత్రకంబులు—తరళ (సరళ) అను పాఠములు మేలని భారతి సూచించుచున్నది. వానికర్థమెంత సరసమో పండితు లూహింతురు గాక.

ఆ ౫-౪౪ కొనియెను నామోద—కొనియెన నాఘ్రాత. అనుపాఠముండిన లెస్సగానుండునని వ్యాఖ్యాతగా రూహించి వ్రాసిరి. (చూ—వ్యాఖ్య)అది భారతి కంటికేల కనఁబడలేదో?

భారతి సూచించిన టక్కునపాఠము లెవ్వియు సరసములు గావు. వానింగూర్చి ప్రస్తావించుట యనావశ్యకము.

ఇఁక వ్యాఖ్యానముపై భారతి వ్రాసినదానిం గూర్చి పరిశీలింపవలసి యున్నది.

౧ సత్యభామా భోగసక్తి—దీనికి వ్రాసిన యర్థమేల భారతికి సమంజసముగాఁ దోఁపదో? ఆయర్థమే సమంజస మని నాయభిప్రాయము.

౨ భువనభావని......దీనికి వ్యాఖ్యాత వ్రాసిన యర్థము తప్పని చెప్పఁదగదు. భారతి వ్రాసినయర్థము సరసముగానే యున్నది. కాని చంద్రునిదానముగ నుపమానముగాఁ జెప్పుట యంతప్రసిద్ధము కాదు. ఆంధ్ర కవులు కొందఱుమాత్రము చెప్పియున్నారు.

3 నరకాసుర దమనుఁడు—దీనికి భారతి సూచించు భావమును వ్యాఖ్యాత (ఈ) అనుబంధములో (X పుటలో) వ్రాసియే యున్నారు. స్తనశల్యపరీక్ష చేసిన భారతి కది యేల దృగ్గోచరము కాదయ్యెనో? భోజకన్య యను పదమెట్లు సాభిప్రాయమగునో తెలిసినదికాదు.

౪. అక్కాంత—ఏకాంతగృహంబు—ఇచ్చట నేకాంత అనుపదము నిరుపయోగమైనది. అరసి యనుట కంటెఁ గన్గొని యనుటయే సరసము. సత్యభామ వెదసుటయేలాగో? కృష్ణుఁడు ప్రేలగించెయా? తెప్పగా వెదకి చూచినంగాని సత్యభామకంటికిం గన్పడఁడో?

బొమ్మకణికా—కళికా-అని యుండవలయునని భారతి ప్రసంగించెను. దీనింగూర్చియు మున్నె వ్రాసియున్నాఁడను. కణికా-అను పాఠముఁ గైకొనిఁగాని యర్థము చమత్కారముగా నుండదు.

౫. వసుభవదీయదానుని...దీనికి సరియగు సంస్కృత శ్లోకము వ్యాఖ్యాత వ్రాయమియు నొక దోషమెుకో?

౬. ఆయత రేజమల్...దీనికి భారతి చెప్పిన యర్థ మిసుమంతయు సరికాదు. రేజమల్-అనఁగాఁ బ్రకాశములని యర్థము. కిరణములనుట సరికాదు. సాయంసమయమున సూర్యకిరణములు దీర్ఘములుగ నుండుననుట సరికాదు. నీడలు దీర్ఘములగ నుండును గాని కిరణము లొకతీరుననే యుండును.

౭. 'తాఁకియుం దలచెడువారు లేరు' దీనికి వ్యాఖ్యాత వ్రాసిన దానికంటె భారతి వ్రాసినది యెట్లు విలక్షణమో తెలియకున్నది.

౮. గజకచ్ఛప కేవమూతుకుండు—గజకచ్ఛపములు తొలిజన్మమున క్షత్రియులని వ్యాఖ్యానమునఁ గలదు.

సంస్కృతమున వ్యాసమహర్షి విభావసుఁడును సుప్రతీకుఁడును దొలిజన్మమున మహర్షు లని చెప్పెను.

"ఆసీద్విభావసుర్నామ మహర్షిః కోపనో భృశమ్,
భ్రాతా తస్యానుజశ్చాసీత్సుప్రతీకో మహాతపాః"

మహర్షులు విప్రులు గాను, విశ్వామిత్రునివలె క్షత్రియులు గాను, నారదునివలె దేవతలుగా నుండవచ్చును. నన్నయభట్టు విప్రు లని వ్రాసెను. తిక్కనసోమయాజి తొల్లి వారలు మధుకైటభు లను దనుజేంద్రు లని వ్రాసెను.

క. 'వినుము మధుకైటభు లనియెడు
దనుజేంద్రులు కచ్ఛపంబు దంతియునై పు
ట్టినవారు తమ్మెఱుంగమిఁ
బెనఁగుదు రొండొరులతోడ భీకరభంగిన్.'

—అనుశాసనికపర్వము, ఆ. ౧.

ఇప్పట్టున వ్యాఖ్యాత వ్రాసినది పొరపాటవవచ్చును. కాని పైనున్న భేదములంగూర్చి యేమి చెప్పందగునో?

౯. జాదులు ప్రసాదము—దీనికి భారతి వ్రాసిన యర్థము సమంజస మనఁదగదు. "ఒకమహానుభావునకు మ్రొక్కినచో వాఁడు కొన్ని జాదులు ప్రసాదముగ నిచ్చును. అవి శిరోజముల కలంకారముగ నుండుచుండుటకును ఉపయోగించునవి. కావున నవి ఉభయథా ప్రయోజనకరములగును." అని భారతి వ్రాసినది చిత్రముగా నున్నది "ఒకమహానుభావునకు మ్రొక్కినచో వాఁడు ప్రసాదముగాఁ గొన్ని జాదులనే యిచ్చునని" యేమి సిద్ధాంతమో తెలియరాదు. మల్లెపువ్వులు, సంపెంగపూవులు, మొగలిపూవులు, తామరపూవులు, చేమంతిపూలు, పారిజాతకుసుమములు, పొన్నపువ్వులు, పొగడపూలు, దవనము, మరువము మొదలగువాని నీయఁడా? ఎవరైనఁ దనకు నమస్కరింపవచ్చినపుడు వెదకియైన నా "మహానుభావుఁడు" జాజిపువ్వులనే తెచ్చి ప్రసాదముగా నిచ్చును గాఁబోలును? మల్లెల నిచ్చెనేని మల్లెలు ప్రసాదము. అని సామెతరావలయుఁగదా. అట్టిసామెత లోకవ్యవహారమున గలదా. గరుత్మంతుఁడు కృష్ణుని కార్యమేకాక తన (పగదీర్చుకొను) కార్యమును సఫలముగునని పొంగినాఁడు. ఈ రెండు కార్యములను సమకూరును. అని భారతి వివరించినది. వ్యాఖ్యాత "ఈ" అనుబంధములో "జాదులనఁగా మనోరథసిద్ధియని యర్థము చెప్పవచ్చునని ప్రకరణమునుబట్టి యూహింపఁదగియున్నది." అని వ్రాసిన దానికంటె భారతి వ్రాసినది యెట్లు భిన్నమో విశేషమో తెలియకున్నది. "జాదులు ప్రసాదము" అన్న సామెత యని భారతి వ్రాసినది. అట్టి సామెతను జనులు వాడుచున్నారా?

౧౦. నొగలన్—దీనికి "మెడమీఁదనుంచి కట్టెడుకొయ్య" అని యర్థము వ్రాసియున్నారేమియని మేము వారి నడుగఁగా వారు "మెడమీఁదనుంచి కట్టెడుకొయ్యతో బండిని జేర్చి కట్టెడు నిడుపసుకొయ్య" యని వ్రాసినట్లు తమకు జ్ఞాపకమున్నదనియు నచ్చుఁగూర్పువారో కాక లేఖకులో పొరపాటున విడిచియుండవచ్చుననియుఁ జెప్పిరి. నొగకును గాడికిని భేదము వ్యాఖ్యాతకుఁ దెలియదని సూచించుట ధర్మేతరము.

౧౧. ఆయతభూర్జపత్రములు—భూర్జపత్రములన్ భుజపత్రవృక్షముల వెడల్పైన పత్రములయందు - అని యర్థము. వ్యాఖ్యానములో "భుజపత్రము లనెడు వెడల్పయిన పర్ణములయందు" అని యున్నది. భూర్జశబ్దమునకు నిఘంటుప్రమాణము వ్యాఖ్యాత వ్రాసియున్నారు. భుజపత్ర, భుజ, భూర్జ శబ్దములు పర్యాయపదములు. కావున భూర్జపత్రములనఁగా భుజపత్రములని యర్థము. ఇప్పుడు పత్రములనఁగాఁ బర్ణములనియే యర్థము. దక్షిణమునను పర్ణములయందుఁ బెట్టుకొని జనులు భుజింతురు, కాని కొన్ని పట్టలయందుఁ బెట్టుకొని తినరుగదా. అన్నము నుంచుకొని తినఁదగినపర్ణము విశాలముగా నుండును. కావున వ్యాఖ్యాత వ్రాసిన యర్థమే సమంజసమైనది.

మఱియు "వనఁగ లేఖక్రియలకు విద్యాధరాంగన లుపయోగింతురని కాళిదాసమహాకవి వర్ణించియున్నాఁడు." అని వ్యాఖ్యాత వ్రాసి కుమారసంభవ శ్లోకము నుదాహరించియుండఁగా దానియందలి "భూర్జత్వచః" అను పదములవలన భుజపత్ర వృక్షముయొక్క—

పట్టులని స్పష్టముగాఁ దెలియుచున్నను గేవలము దోషో ద్ఘాటన తత్పరతవహించి వ్యాఖ్యాతవాక్యము పర్ణముల నుపయోగించుటను నర్థము నిచ్చుచున్నది అని భారతి వ్రాయుట తగదు.

మఱియు భూర్జపర్ణములమీఁదను బూర్వకాలమున లేఖములు వ్రాసెడు వాడుక కలదని తెలియవచ్చెడు. ధన్వంతరినిఘంటువునందు "భూర్జో భుజో బహుపుటో మృదుత్వగ్లేఖ్యపత్రకః" అని భూర్జవృక్ష పర్యాయశబ్దములు గలవు. దీనిచే భూర్జవృక్షపత్రములను బూర్వకాలమునందు వ్రాయుట కుపయోగింపఁబడుచుండెనని తెలియవచ్చెను. విక్రమోర్వశీయమునందుఁ గాళిదాసమహాకవి 2 వ యంకము, 11 వ శ్లోకమునకుఁ బిదప,

ఊర్వశీ—(ధ్యాత్వా) హాధిక్. హాధిక్. మామేవ ముపగచ్ఛతి. సఖి. అసమర్థాస్మి ప్రత్యక్షం ఖ్యాత్మానం దర్శయితుమ్. తత్ప్రభావనిర్మితేన భూర్జపత్రేణ లేఖం సంపాద్యాన్తరా క్షేప్తుమిచ్ఛామి.

రాజా—(విభావ్య) నాయం భుజంగనిర్మోకః. భూర్జపత్రగతోఽయ మక్షరవిన్యాసః.

ఇది తెలుపఁదగిన చరిత్రాంశముకాదా. "మఱియు నేవిధమునను సంబంధములేని అనంగలేఖ క్రియలతోఁ నిక్కడ పనియేమి" అని భారతి యాక్షేపించినది. భూర్జవృక్ష మెల్ల చోటులకు దొరకునదికాదు. ఆ వృక్షము మఱియొకవిధముగా నుపయోగింపఁబడునను సంబంధము కలదు. కావుననే దానిని రసికులకు చదువరులకుఁ దెలుపుటకై వ్యాఖ్యాత వ్రాసెను.

౧౨. బాచదప్ప వరగండాంకా—"ఇది కన్నడబిరు" దనియు దీనికి "ఆడినమాటను తప్పనివారికి మగఁడు. అని యర్థ" మనియు భారతి వ్రాసినది సరియే యగుంగాని మగఁడనుటకుబదులు శిక్షకుఁడని వ్రాయుట యుక్తము. కన్నడములో 'బాస' అను శబ్దముగలదు. దానికి మాట, ప్రతిజ్ఞ—అనునర్థములుగలవు. 'బాచ' అను శబ్దము కన్నడములో లేదు. తప్పెదఱు—తప్పువారు. అనికలదు. కావున నిక్కడఁబాఠము "బాసె దప్పువరగండాంకా" అని యుండఁదగు. 'భాష. గెదప్పువరాయరగండ,—అని యొక శాసనమునం దున్నట్లు తెలియవచ్చెడు.

౧౩. అన్యతోదరి—ఇది సాభిప్రాయమని వ్యాఖ్యాతయెత్తి చూపలేదని భారతి వ్రాయఁగాక. దాని సారస్యమును వ్యాఖ్యాతను త్రింపమి వింతగాఁ దోఁచునని వ్రాయుట యనుచితమగు వ్యాఖ్యాతృనిందయగు.

౧౪. చిలువయను పదమునకు వ్యాఖ్యాత వ్రాసిన యవయవార్థము సమంజసమేకాని తప్పుకాదేరము. శబ్దరత్నాకరమునందలి రూపనిష్పత్తియు నర్థాంతరముగా గ్రహింపఁదగు.

౧౫. చక్కాఁగావించితివి—నఱికితివి. అనిననేమి? నశింపఁజేసితివి. అనిననేమి? చక్కు—అవఁగాఖండము. అని శబ్దరత్నాకరమునఁ గలదు. అయినను

" పదమునంబుచేసెఁ జక్కాఁడె నుగ్గాడెఁ
జదిపెఁబీచమడఁచెఁ జంపెఁగడపె
నఱుముచేసెఁద్రుంచెఁ బరిమార్చెఁ దెగటార్చె
నన్నిగొనియెఁదునిమె నుఱిసెనఁగ
హతముగావించెననుటకు నాఖ్యలయ్యె" అని యాంధ్రనామసంగ్రహము.

౧౬. కుహళీ—దీనికిఁ బూనుత్తులను నర్థము సరికాదనియుఁ జోకపాత్ర అని యర్థమనియు భారతి వ్రాయుచున్నది. అది సరికాదు. అది యుదాహరించిన కవి కర్ణరసాయనకావ్యములోని పద్యమువలననే కుహళి యనఁగా గుత్తి యనియే యర్థము చెప్పవలయునని స్పష్టమగును. కావునఁ బూగశబ్దము పునరుక్తమగును.

వసుచరిత్రము ఆ. ?.

క. మందారముకుళకుహళీ
కందళితమకరందతుంది కమిళిందవధూ
బృందాభినందితంబగు
మందానిలమెలయు విజితమార్గశ్రమలై.

దీనికి వ్యాఖ్యాత మందార = దేవతా వృక్షభేదముల యొక్కయు, ముకుళ = మొగ్గలయొక్కయు, కుహళీ = గుత్తుల

యందు, కందళిత-శోత్పన్నమగుచున్న. అని వ్రాసియున్నారు. ఇక్కడ భారతి చెప్పిన చొప్పునఁ శోకపాత్తులని యర్థము చెప్పినచోఁ శోకప్రాని ప్రస్తావమే లేని యీ పట్టున నది యపార్థమగును.

౧౭. ఎలదేఁటిదాఁటులో—దీనికి భారతి చెప్పిన దాని నర్థాంతరముగా గ్రహింపనగునుగాని వ్యాఖ్యాత చేసిన యర్థము సరికాదని చెప్పఁదగదు. మఱియు దాఁటుటవలన దప్పి పుట్టెననుట సరసము కావున నీ యర్థమును సమంజసము. మూఁగఁబడి చుట్టుకొనియని యర్థము. స్వార్థమునఁ బడుధాతు వనుప్రయుక్తము.

౧౮. పెరిగిన హీరరత్నముల పెల్లున—దీనికి వ్యాఖ్యాత వ్రాసినది సరికాదని చెప్పి భారతి విశేష మేమియు వ్రాసినట్లగపడదు. వ్యాఖ్యాత విపులముగా నర్థము వ్రాసియున్నారు. భారతి రఘువంశ శ్లోకమొక్కటి వ్రాసినది. ఇంతకంటె విశేషమేమియుఁ గానము. ఈ శ్లోకమునందు సముద్రమునఁ దామ్రపర్ణీ సంగమస్థలము నందు మౌక్తికోత్పత్తి కలుగుట ప్రసిద్ధియని మల్లినాథసూరి వ్రాసెను. "తామ్రపర్ణీ సంగమే మౌక్తికోత్పత్తి రితి ప్రసిద్ధమ్."

౧౯. ఇంద్ర ద్రుమోత్పాటనంబు — దీనికి దేవదారు వృక్షమని వ్యాఖ్యాత వ్రాసినయర్థము పొరపాటన వలయును. మద్దిచెట్టను నర్థమే సరసము. అయినను భారతి దీనియర్థము విపులముగఁ జెప్పక వదలినది.

౨౦. కదనాభిశంసియై—అభిశంసియై నిందించునదియనియు స్తుతించునదియు (నవఁగాఁ దెలుపునది యనియు) నర్థములు కలవు. వ్యాఖ్యాత వ్రాసిన యర్థములోఁ బొరపాటేమియుఁ గానరాదు.

౨౧. మానసవేగరథ్యమును—గుఱ్ఱము కలదియు ననుటయే సరి. వ్యాఖ్యానమునఁ "గలదియు" ననుపదము లేమి ముద్రాస్ఖాలిత్యమునవలయుంగాని యీ యల్పవిషయమున వ్యాఖ్యాత తప్పువ్రాసెననుట యనార్యత్వసూచకము. దీనికిఁ బిమ్మట రెండుసమాసములకును బహువ్రీహ్యర్థద్యోతకమగు "కలది"యను పదమును వ్యాఖ్యాత వ్రాసియే యున్నారు.

ఇంతటితోఁ దృప్తినొందక భారతి యనుపశాంతావేశముతో "నిట్టి వెన్నియైన చూపవచ్చును. గ్రంథవిస్తరభీతిని విడువఁబడియె" నని వ్రాసినది. ఇది పరిచ శోల్లాపమును జూడనివారికి దీనిమీఁద నరుచి పుట్టించుటకై యీసుతో వ్రాసిన వ్రాఁతవలెఁ గన్పట్టుచున్నది.

అలంకారలక్షణములను వ్రాయవలసినచో వస్తూత్ప్రేక్షకు, హేతూత్ప్రేక్షకు, గమ్యోత్ప్రేక్షకు అర్థశక్తిమూలధ్వని మొదలగు దాని లక్షణముల నెంత విస్తరముగా వ్రాయవలసియుండును. కావున వ్యాఖ్యాత వానిని వ్రాయరైరి. "కొన్ని సంస్కృతపదములకు రూపనిష్పత్తులు వ్యాఖ్యాత వ్రాసియుండిరి. పండితపామరుల కనావశ్యక"మని భారతి నుడువుచున్నది. పామరులకు నాంధ్రపండితమ్మన్యులకు నెట్లున్నను జిజ్ఞాసువులకవి యావశ్యముగాఁ దెలుపఁదగినవే. మఱియు "ననావశ్యకములగు వానిని పెంచివేయుట ఆవశ్యకములగు వానిని త్రుంచివేయుట నీ వ్యాఖ్యానమున నచ్చటచ్చటఁ గానవగు." నని భారతి పలికెను. ఈ వ్యాఖ్యానమందట్టివి లేవని సరసులగు పండితోత్తముల యభిప్రాయము.

"గ్రంథావతరణి కాభాగమున గలచరిత్ర విషయములకు ఇంకను విపులముగు వివరణమావశ్యక"మని భారతి చెప్పెను. సంగ్రహముగా నున్నచో విపులముగా నుండవలయు, విపులముగా నున్నచో సంగ్రహముగా నుండవలయు. అను నిట్టి విమర్శన మెట్టివారు వ్రాసిన దాని మీఁదను జేయవచ్చును.

మనుచరిత్ర పారిజాతాపహరణ కావ్యముల తారతమ్యమును వ్యాఖ్యాత సహేతుకముగా నిరూపించి పారిజాతాపహరణమే మేలగు కావ్యమని నిర్ణయించియుండఁగా భారతి యేవో కారణములను పీఠికయందు పేర్కొన్నారని వ్రాసి వ్యాఖ్యాతకుఁ బారిజాతాపహరణముపైఁగల "యెక్కువ మక్కువ"యే కారణముగావలయునని యెత్తిపొడుపుమాట వచించినది. వ్యాఖ్యాతకుఁ బారిజాతాపహరణమందుఁ గల గుణాధిక్యమువలననే నిక్కముగా దానిపై మక్కువ యెక్కువ యవఁదగు. ఆకారణముగా జనులకు మక్కువ యెక్కువ యగుట యసంభవము. అనుదారగుణులకుమాత్ర మకా

రణముగా దేనిపైనైనను మక్కువతక్కువ యగుటయు నీసుతోడరుటయు సంభవింపవచ్చును. "మక్కువ యెక్కువ"యని రెండుమాటలు లీవిమర్శనమునందు భారతి వ్రాయుటచే వ్యాఖ్యాతకుఁ బారిజాతాపహరణ మహాకావ్యముపై మక్కువ యెక్కువగా నుండుటయు వారియందు గొప్ప దోషమని భారతి భావించుట స్పష్టము. తనయందుఁ గలవని భారతి చూపిన యనేకదోషముల తోడ నీ గొప్పదోషముం జూపినందులకు వ్యాఖ్యాత భారతిదెసఁ గృతజ్ఞులగుదురుగాక. భారతి యభిప్రాయ మెట్లున్నను పై రెండు కావ్యములలోను సర్వవిధంబులను మనుచరిత్రకంటెఁ బారిజాతాపహరణమే రసవత్తర కావ్యంబని నాయభిప్రాయము, ననేక పండితవతంసుల యభిప్రాయము నై యున్నది. ఒక్క యుదాహరణము మాత్రము చూపెదను. మ. రా. శ్రీ ఆంధ్ర శేషగిరి రావుగారు "ఆంధ్ర సర్వస్వము"ను పత్రికలో నిట్లు వ్రాసియున్నారు:

"అర్థసంపద—భావచమత్కృతి, రసపుష్టి, సందర్భశుద్ధి, వస్తురచనాకౌశలము, కవితాసంభారముల నెల్ల చేర్చి కూర్చి తెలుఁగు పలుకుబడుల సుబాళింపులతోఁ గావ్యమును భోగ్యద్రవ్యముగా నొనర్చి ఆంధ్ర ప్రబంధ కవులలోఁ దిమ్మన పీఠమెక్కినాఁడు. వేయేల? దేశభాషలందుఁ దెలుఁగు లెస్సఁగా సృష్టిపడిన కావ్య స్రష్టలలోఁ దిమ్మనార్యుఁ డుత్తమశ్లోకుఁ డనఁ జెల్లును.

ఆంధ్రప్రబంధ భాండారమునఁ బ్రథమస్థానము ప్రభావతీ ప్రద్యుమ్నమునకుఁ జెందుట నిర్వివాదాంశము. ద్వితీయస్థానము మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణములలో నెద్దానికి లభించుననుట విమర్శకులు పరామర్శింపవలసిన విషయము. ఈ సందర్భమున నెంతయేని అవకాశము గలదు భేదాభిప్రాయములకు. పారిజాతాపహరణమే ద్వితీయస్థానమున కర్హమని నా వాదము. పాక్షికబుద్ధితో విమర్శకులా స్థానమును పారిజాతాపహరణమున కీయకున్నచో నదియే మను వసుచరిత్రల మెడఁబట్టి నెట్టి వెన్నడఁజేసి ఆస్థానము నాక్రమించి అలంకరించి యుండఁగలదు. అందులకుఁ గారణము లీవ్యాసమున నాయాతావుల వివరించియే యుంటిని."

మనుచరిత్రము పారిజాతాపహరణమువంటి కావ్యములకు మార్గదర్శకమని భారతి వ్రాయుట వింతగా నున్నది. ఆ రెండు కావ్యములును నించుమించుగా నొక కాలముననే పుట్టినవి. మఱియు లెస్సగాఁ బరికించినచోఁ బారిజాతాపహరణమే మనుచరిత్రమునకంటె మున్నుగా రచియింపఁబడినదనియుఁ దెలియవచ్చెడిని. మనుచరిత్రమునందు (ఆ. ప. ౩౮) "కటకపురిఁగాల్చె గజరాజు కలఁగిపఱచె" నని కృష్ణరాయని వర్ణించు పద్యమునఁ జెప్పఁబడినది. పారిజాతాపహరణమునందు (ఆ. ప. ౨౩) "బలనికాయము కాలిగుట్టుల నడంచుఁ గటకమును నింకననుచు నత్కళమహీశుఁ డనుదినమ్మును వెఱచు నెవ్వనికి" నని చెప్పఁబడెఁది. ఈ రెండింటిని బరిశీలింపఁగాఁ బారిజాతాపహరణము వ్రాయునప్పటికిఁ గృష్ణరాయఁడు కటకమును జయింపలేదనియు, మనుచరిత్రము రచించునప్పటికి జయించియుండెననియుఁ దెలియవచ్చుటచే మనుచరిత్రమునకంటెఁ బారిజాతాపహరణమే మున్నుగా రచియింపఁబడియెనని చెప్పవలసియుండును గదా. అట్లయినచోఁ బారిజాతాపహరణమే మనుచరిత్రమునకు మార్గదర్శక మనఁదగియున్నది.

కడపటి భారతి "యూడదాని కాలికేతి తన్నదిమట శ్రతము రసాభాసముకాదు కాబోలు. కడునీతికరము కాబోలు." అనియుఁ "బారిజాతాపహరణమునఁ జప్పిడిపద్యములు ఎక్కువగా గలవని చెప్పవచ్చు" ననియు "నిట్లు కుతర్కమున కెన్నియైన లోపములు కనుపడుచుండునవియుఁ గాని నిష్పక్షపాతదృష్టిని జూచిన నభయగ్రంథములును దాని దాని యునికినిబట్టి యది యది రసవంతముగనే యున్నదని సహృదయులు భావింపకపోరు" రనియుఁ జెప్పి ముగించెను.

"దాని దాని యునికినిబట్టి యది యది రసవంతముగనే యున్న" దను కడలఁ దారతమ్యవిచారణమునకుఁ బ్రసక్తియే యుండదుకదా. "దానిదాని యునికినిబట్టి" అనఁగా నర్థమేమో తెలియకున్నది. నిష్పక్షపాతముగా సకారణముగా వ్యాఖ్యాత వ్రాసి తమ యభిప్రాయమును దెలిపియుండఁగా వారు "కుతర్కము"చే నిట్లు వ్రాసిరని సూచించుట మిక్కిలి శోచనీయము, వ్యాఖ్యాత

వ్రాసినది భారతికి సమ్మతముగానున్నచో నది సరికాదని వ్రాయుట యుచితము. కాని వ్యాఖ్యాత వ్రాసిన కారణములు "అతర్క్య" మని నిందచేయుట యార్యజనులకుఁ దగునా? "మఱియుఁ బారిజాతాపహరణమునందే చప్పిడిపద్యములు ఎక్కువగాగలవని చెప్పవచ్చును." అని భారతి వచించెను. ప్రతిపద్యరసాన్వితంబని సకలాంధ్ర విద్వద్వరేణ్యులు కీర్తించుచున్న యక్కావ్యరత్నముపై భారతి కట్టియభిప్రాయమునయించుట నంది తిమ్మకవి దౌర్భాగ్యోదయముచేనని యూహింపవలసియున్నది.

"ఆతఁడావి కాలిచేత తన్నుతినుటమాత్రము రసాభాసముకాదు కాబోలు" అని భారతి వ్రాసినది వింతగానున్నది. దీనిచే రసాభాసమనఁగా నేమియో భారతికిఁ దెలియదనుట తెల్లంబయ్యెను. సాహిత్యదర్పణము తృతీయపరిచ్ఛేదము కడపట రసాభాసము వివరింపఁబడియున్నది. దానింజదివియుండినచో భారతి పైకనఁబఱచినట్లు వ్రాసియుండదు. దంపతుల ప్రణయకలహంబున నాయికకుఁ బ్రణమిల్లుటయు నాయికచేఁ బాదాహతిం బొందుటయు రసాభాసముకానేరదు. రసాభాసశబ్దమునకే యీ ప్రకరణమునఁ బ్రసక్తిలేదు. వ్యాఖ్యాతయిప్పట్టున విపులముగా నలంకారశాస్త్రచర్చ చేసి మానభేద తదపనోదనవిధానభేదములను వివరించి యుద్గ్రంథములనుండియు యుదాహరణములను వ్రాసియున్నారు. అవియే చాలినవైనను నింకొకటి పురాణమునుండి యుత్తి వ్రాసెదను. శివుఁడు పార్వతీదేవి ప్రణయకోపము నుపశమింపఁజేయుటకై యుద్దేవికిఁ బ్రణతుఁడైనట్లు వేదవ్యాసమహర్షి వ్రాసెను.

శ్లో. యద్యేవా కంపితా భీరు త్వం తదాహం వదై పునః,
సర్మవాదీ భవిష్యామి జహి కోపం శుచిస్మితే;
శిరసా ప్రణతే నైవ రచితస్తే మయాఽంజలిః.
—(మత్స్యపురాణము, ౧౫౪ అ. ౧౩-౧౪ శ్లో.)

ఈ పరిమళోల్లాసమునందలి విశేషములఁ గూర్చి సేకొన్ని నవలసియున్నను గ్రంథవిస్తరభీతిచే వదలెదను. నిక్కముగు స్థాలిత్యములను జూపిన తావులనూత్రము వ్యాఖ్యాత భారతి దెసఁ గృతజ్ఞులై యున్నవారని విన్నవించుచు నింతట నీ విషయమును విరమించుచున్నాఁడను. ఇందుఁగల ప్రమాదములను బండితాఖండలులు క్షమింతురని ప్రార్థించువాఁడను.

---

## వైద్యగ్రంథవిమర్శన సమాధానము

నాచే రచింపబడిన ఆయుర్వేదౌషధ రత్నాకరమును, ఆంధ్రభైషజ్య రత్నావళియు 1931 జనవరినెల పుష్యమాస భారతి సంచిక యందు విమర్శింపబడినవి. ఆవిమర్శకకు తగుసమాధానమును వ్రాయుట చాల అవసరమేయని తలచి క్రిందివిధమున సమాధానమును వ్రాయబూనుచున్నాను.

ఈగ్రంథమునందలి రోగములకు ఆకరములను తెలిపినచో బాగుండెడిది అని వైద్యవినోదిగారు వ్రాసిరి. ఈగ్రంథమునందలి రోగములు ఎట్లు గ్రహింపబడినదియు, దేనినుండి గ్రహింపబడినదియు, ఎవరెవరివద్దనుండి గ్రహింపబడినదియు మొదలగు సంగతులన్నియు స్పష్టముగ వ్రాయుచు ఆకరములను తెలుపకపోవుటకు కల కారణమునుకూడ ప్రథమద్వితీయ ముద్రణముల యొక్క విజ్ఞాపనములయందు వ్రాసియే యున్నాను.

లోకనాథ రసము.— బసవరాజీయమందు కృయ ప్రకరణమున చెప్పబడిన రోగమునకును నేను వ్రాసిన రోగమునకును ఏమియు భేదము లేదు. భేదము కలదని వ్రాయుటకు కారణము తెలియదు. భేదమును చూపింపుడు.

వంటసువర్ణ సూర్యావర్తి.—నాకు లభించిన ఈరోగములలో అనుభూతములును, ప్రసిద్ధములును, చక్కగ పనిచేయునవియు నగు రెండురోగములను వ్రాసితిని. మఱిభేదములుకల రోగములు ఇంకను నావద్ద కలవు. నేను వ్రాసిన రోగములనుబట్టి చూచినచో వైద్యవినోదిగారి వద్ద రోగమే మఱిభేదము కలది (మార్పు కలది) అయి ఉండ కూడదా? వారిదే సర్వసిద్ధాంతమైన రోగమని చెప్పుటకు వారికి ఏమైన అవకాశము కలదా?

సువర్ణ లోకనాథ రసము.— దీనికిని వంటసువర్ణ సూర్యావర్తికి వ్రాసినసమాధానమునే సమన్వయించుకొన వచ్చును.

వసంత కుసుమాకరము.—దీనియందలి సూత శబ్ద విషయమై నా అభిప్రాయమును ఎంతమాత్రము సరిగ కనుగొన జాలక, అనవసరముగ ఏదియో వ్రాసిరి. ఇందు కేవల రసము కే గాక రసభస్మనే వేయవలెనని నా అభిప్రాయము కాని రస సిందూరాదులను వేయకూడదని నా అభిప్రాయము ఎంతమాత్రము కాదు. అట్లయినచో అమతభేదములను ఎందులకు వ్రాసితిని? అట్టి అభిప్రాయము దేనివల్లను సూచించుట లేదు. అనవసరముగ భ్రమపడిరి. ఇప్పుడైనను సరిగ చూచుకొనవలయును. సాధ్యమైనంతవరకు వ్యాకరణ యుక్తముగను, అర్థసమన్వితముగను ఉండవలెనని అనేక యోగములయందు ఇటులనే సంస్కృత పదములను మార్చితిని అట్లే ఇక్కడ కూడ మార్చితిని. కాని పాదరసభస్మ అని అర్థము వచ్చుటకు ఎంతమాత్రము నే నట్టి శ్రమ పడియుండ లేను. అటి అర్థము కావలసినచో సూతశబ్దముచే కూడ వచ్చుటకు ఏమియు అభ్యంతరము లేదు. రసరత్న సముచ్చయము, అమరకోశము మొదలగు చాల గ్రంథములయందు సూత పారదశబ్దములు పర్యాయ వాచకములుగనే చెప్పబడియున్నవి. వైద్యవినోదిగారు సూతశబ్దముచే రససిందూరమె గ్రాహ్యము కాని పాదరసభస్మ గ్రాహ్యము కాదు అని స్పష్టముగ వ్రాసిరి. మతభేదముచే రససిందూరము గ్రాహ్యము కావచ్చును కాని ఇతరము గ్రాహ్యము కాదు అని వారుచెప్పుటకు వారికి ఎంతమాత్రమును అవకాశము లేదని నేను ఘంటాపథముగ చెప్పగలను.

కాంతవల్లభరసము.—ఇందు "అమోరజః" అనెడి వివాదగ్రస్తమగు విషయమునకు వివరణమందుకూడ ఇదమిత్థమని ఏమియు నిశ్చయింప లేదని వ్రాసిరి. వారికి కలిగిన ఆ వివాదగ్రస్తమగు సందేహ మేమిటియో వారు కొద్దిగనైనను సూచించినచో తత్సమాధానము వ్రాసెడివాడను. అట్లు ఏమియు సూచింప లేదు. కాని సందేహగ్రస్తములైన విషయము లన్నియు ఔషధవిషయములు మొదలగు విషయములలో చెప్పుటనో యొకచోట పూర్తిగ విమర్శించి వ్రాసియే యుందునని నాకు పూర్తి నమ్మకము కలదు. వారు ఆ వివాదగ్రస్తమగు సందేహమును తెలుపవలయును. నే నిదివరలో ఎన్నటను వ్రాయకుండినచో వారికి ప్రత్యేకముగ వ్రాయగలను. యోగమందు "శిలాజతు" అని సామాన్యము కలదు. ఈ శిలాజతుశబ్దముచే గోమూత్ర శిలాజతువు గాని, కర్పూర శిలాజతువుగాని గ్రహింపవచ్చును. ఇదివరలో చాలమంది కర్పూరశిలాజతును వేయుచున్నమాట నిజమే కాని శిలాజతుశబ్దముచే గోమూత్ర శిలాజతును గ్రహించుటకు ఎంతమాత్రము అభ్యంతరము లేకపోవుటచేతను, గోమూత్ర శిలాజతునకు శాస్త్రమందు అమోఘములైన గుణములు చెప్పబడియుండుటచేతను, ప్రస్తుతము చాలమంది గోమూత్రశిలాజతునే వేయుచుండుటచేతను, గోమూత్రశిలాజతు వేయబడినదే అధికముగ పనిచేయుచుండుటచేతను గోమూత్ర శిలాజతు వ్రాయబడినది. యోగమందు ఇదమిత్థమని సూచింపకపోయినను ఇదివరలో కర్పూరశిలాజతు వేయుటకు ఎట్టికారణము కలదో, అట్టికారణము కే గోమూత్ర శిలాజతు కుప్పెలు కట్టుకొనునప్పుడు కలపవలయు ననుటకు కారణముగ నూహించుకొనవలయును.

షడ్గుణ బలిజారిత మకరధ్వజము.— ఈ యోగము విషయమై విమర్శించుచు వ్యక్తిగతములుగ కొన్ని అనవసరములగు పదములను ప్రయోగించిరి. నే నట్టి పదములను ప్రయోగింప దలచుకో లేదు. వీరు ఆయుర్వేద ప్రకాశము మొదలగు గ్రంథములనుండి ఆయా గ్రంథముల రీత్యా గంధక జారణమును, దాని గుణములను చాల విపులముగ వ్రాసిరి. కాని ఏదైనను ప్రస్తుతము వాడబడు మకరధ్వజమునకు బంగారము మొదలగువానియొక్క పరిమాణములు మొదలగువానినైనను వ్రాయక అక్కడకు వచ్చునప్పటికి సంక్షేపించి ఊరకుండిరి. కొంతమంది గ్రంథకారుల యొక్క అభిప్రాయము ప్రకారము అట్టి జారణము చేసి తయారు చేసికొనవచ్చును. కాని నేను వ్రాసిన విధమునకూడ నిస్సందేహముగ తయారుచేసికొనవచ్చుననియు, ఇట్లే చాలామంది తయారుచేయుచున్నారనియు, ఇట్లు తయారుచేయబడిన దానినికూడ "షడ్గుణబలిజారిత మకరధ్వజ" మనెడి పేరుతో నిస్సందేహముగ వ్యవహరింప వచ్చుననియు ఘంటాపథముగ చెప్పగలను. ఏ మతభేద ప్రకారము తయారుచేసినను నేను వ్రాసిన విధమునకు కూడ కొన్ని మతభేదములచే

జారితత్వము నిస్సందేహముగ కలుగును. జారణ, జారిత శబ్దములకు అర్థమును గ్రహింపుడు. కాన 'వైద్యవినోది'చే ప్రయోగింప బడిన పొరపాటు, విస్మరించుట, ప్రమాద వశము మొదలగుపదములు వారికే సంక్రమించు ననుటకు ఎట్టిసందేహమును లేదు. నేను వ్రాసిన "షడ్గుణ బలిజారిత మకరధ్వజ" మునకు ఆకరము కావలసినచో 1922 మే నెల ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక 178 పేజీ— బంగాళీ భైషజ్య రత్నావళి 115 పేజీ—చూడుడు.

కాంతవల్లభరసము.— కాంతము ప్రధానముగ గలది అనెడి అర్థము స్ఫురింపవచ్చును. కాని ఇతరవస్తువులు కూడ చాలభాగములు కలసియుండి కాంతము రెండుభాగములు మాత్రమే హెచ్చుగ కలసియుండుటచే కాంతము ప్రధానముగ కలది అని వ్రాయుట ఇష్టము లేక అట్లు వ్రాసితిని. వైద్యవినోదిగారు వ్రాసినవిధమున కాంతము ప్రధానమైనది అనెడి అర్థము ఎట్లు వచ్చుచున్నదో తెలియకున్నది.

కాలకూటము.— ఇట నేను వ్రాసినఅర్థము డొంకతిరుగుడుగ నున్నదట. అట్లుండునని తప్పుటర్థమును గాని, తలతిరుగుడర్థమును గాని వ్రాయునా? అమరకోశము నందును, చరకచికిత్సాస్థానమందును కాలకూటమును, నాభియు వేరువేరు విషములుగ చెప్పబడినవి. అట్లుండ కాలకూట శబ్దమునకు నాభి అని అర్థము ఎట్లు వ్రాయగలము? ఒక వేళ కాలకూటమును నాభియు నొకటేయని వైద్యవినోది గారివలె నేనుకూడ భ్రమపడినను, యోగమందలి భాగములు తెలియక నాభి ప్రధానమైనదని ఎట్లు వ్రాయగలము? కొంచెమెచ్చుతక్కువ నాభితో సమానముగ కలియు వస్తువులిందనేకములు కలవు. మరియు నాభికంటె అధికముగ కలియు త్రికటుకములే కలవే. ఇట్టివిషయములు చూచినప్పుడు సమాధానము వ్రాయుటకూడ చాల అనవసరమని తలచితిని. కానిలోకులకు తెలియుటకూడ కొంత అవసరమే యని వ్రాసితిని. "అనేక ప్రాచీన శిథిలగ్రంథములనుండియు, అనేకమందియొద్ద వ్రాతపుస్తకములనుండియు గ్రహింపబడి వ్రాయబడినది అని వారే వ్రాసుకొని ఆగ్రంథమునకు కృష్ణపండితీయమని అన్యనామమిడిరి." అని అధిక్షేపించిరి. ఏమి చిత్రము! వాగ్భటము, బసవరాజీయము, శార్ఙ్గధర సంహిత, మాధవనిదానము, రసరత్నసముచ్చయము, మొదలగు అనేకగ్రంథములయందు ఆగ్రంథకర్తలు ఇతరగ్రంథములనుండియే ఆవిషయములను సంగ్రహించితిమని స్పష్టముగ వ్రాసికొనియే యున్నారుగదా! అప్పుడు బసవరాజీయము, మాధవనిదానము, శార్ఙ్గధర సంహిత మొదలగు పేరులచే వానినెట్లు వ్యవహరించిరి? ఇట్టి ఉదాహరణములు సంస్కృత గ్రంథములయందు గాని, తెలుగు గ్రంథములయందుగాని వేనవేలు కలవు. నేను గ్రంథకర్తనే కానని వారు స్పష్టముగ వ్రాసిరి. అందుచే నాకు విచారము ఎంతమాత్రమును లేదు. కాని వారియూహ ప్రకారము గ్రంథకర్త లెవ్వరో, గ్రంథశబ్దమున కర్థమేమియో తెలియకున్నది. ఏది ఎట్లున్నను వీరి ప్రస్తుతపుయూహ ప్రకారముపైన ఉదాహరించిన గ్రంథకర్తలే గాక ఇతర గ్రంథములను గాని, ఇతరులయొద్ద విషయములనుగాని ఆధారముగ చేసికొని వ్రాసితిమని వ్రాసికొన్న ప్రతివారును "గ్రంథకర్త"అని వ్రాసికొన్న పేరును చింపివేసి ఇదివరలో వ్రాసికొన్నందులకు వారిని క్షమాపణ కోరవలసినదిగ కనబడుచున్నది.

తుదకు వీరు ప్రకటన విషయమైకూడ జోక్యము కలుగ జేసికొనిరి. నేను గ్రంథకర్తనే కానప్పుడు "ఈ గ్రంథమును ఎవరును ప్రకటింప కూడదు" అని వ్రాసికొనుట నాకు సంభావ్యము కాదట. ఇట్టి విషయములకు సమాధానము వ్రాయుట అనవసరమే. ఎట్టివారు ఇట్లు వ్రాసికొనుటకు అర్హులో తెలియకున్నది. బసవరాజీయము మొదలగు గ్రంథములయందు ఎట్లు వ్రాయబడినదో నేనుకూడ అట్లే వ్రాసితిని. పాఠకులకు శ్రమ కలుగకుండుటకై ఇంతటితో విరమించుచున్నాను.

## ఆంధ్రభైషజ్య రత్నావళి

ఇందలి యోగములు ఎట్లు గ్రహింప బడినదియు ఉపోద్ఘాత మందే స్పష్టముగ వ్రాసితిని. ఆయుర్వేదౌషధ రత్నాకరముకంటె ఈగ్రంథము ప్రశస్తముగ నున్నదట. నేను చాలా సంతోషించితిని. వీరి అభిప్రాయ ప్రకారము ఆయుర్వేద ఔషధ రత్నాకరము

విశేషించి బాగుగ లేవల్లేకదా. జనసామాన్య మందరిచేతను గాక కేవల వైద్యులచేతనే కొనబడు నీగ్రంథము ౫—౬ సంవత్సరములలోనే రెండు ముద్రణములు పూర్తి అయి మూడవ ముద్రణమునకు సిద్ధముగ నున్నది. ఆంధ్ర దేశమం దిదివరలో ఇట్టిగ్రంథము వెలువడలేదని అనేక మంది శ్లాఘించుచున్న సంగతి అందరికిని తెలిసిన విషయమే. ఈపుస్తకమును కొన్ని వేలకొలది వైద్యులు, వీరి ఊహ ప్రకారము ఏమియు విచక్షణ లేని వారుగ కనబడు చున్నారు. ఇందు ప్రమాదములు లేకపోలేదట. ఇంతటితో నన్ను వదలి వేసినందులకు చాల సంతోషించు చున్నాను. రాస్నాతైల మందు ఏరండ తైలమునకు బదులు తిలతైలమును వాడినానట. రాస్నాతైలము అనెడి పేరుతో అనేక తైల యోగములు కలవు. కొన్ని యోగములయందు ఏరండతైలము చెప్పబడియుండవచ్చును. నేను శ్రీగోపాలాచార్లుగారి వద్ద చదువు ప్రారంభించినది మొదలుగ నీ 17 సంవత్సరముల నుండియు ఈవిధముగనే చేయుచున్నాను. వారివద్దనున్న ఆరు సంవత్సరములుకూడ ఇట్లే తయారుచేసితిని. వారు నాకు ఈవిధముగనే 'నోట్సు' చెప్పిరి. అందుచేతనే శ్లోకము లేక వచనము వ్రాయవలసి వచ్చినది. ఇందుకూడ ఏరండ తైలమే యని తగు ప్రమాణమును చూపించినచో నేను దిద్దుకొనుటకు ఎంతమాత్రము నభ్యంతరము లేదు.

అశోకమునకు నరమామిడి అని పొరపాటున అర్థము వ్రాసితినని వారు ఏదియో వ్రాయుచూ అది దొరకు మద్రాసు మలబారు మొదలగు అరణ్యములు కూడ వ్రాసిరి. మలబారుదేశస్థులు మొదలగు వనేకమంది యొద్ద మద్రాసునందే ఆరు సంవత్సరములు శుశ్రూష చేసి, అనేక వస్తుప్రదర్శనములను చూచి, అనేకమంది సహవాసము చేసి, అనేకచోట్ల పనిచేసిన నాకు ఈయుద్దశ్యములునా, అశోక శబ్దముచే దేనిని వాడవలసినదియు తెలియకున్నదా! వైద్యవినోదిగారు ప్రకటించిన అశోకమే వాడవలసినదిగ నాముఖ్యాభిప్రాయము. కాని దానికి మద్రాసునందును, ఈప్రాంతములయందును అశోకమనియు, నరమామిడి అనియుకూడ నిస్సందేహముగ వాడెదరు. అందుచేతనే తెలుగున నరమామిడి అని వ్రాసితిని. నరమామిడిశబ్దముచే కొందరు ఇంకొకవస్తువును గ్రహింపవచ్చును. దానికి నేనేమి చేయగలను? మూలికలవిషయమై పెక్కువాదుకలు కలవు. అవన్నియు విమర్శించి ఈపుస్తకమందు వ్రాయుట నావిధి కాదు. అట్లువ్రాయ మొదలిడినచో అట్టి మూలిక లనేకములు కలవు. వానినిగూర్చి వేరుగ కొన్నిపుస్తకములు వ్రాయవచ్చును.

కుంకుమాదితైలము.—ఇందు కొంతమార్పు కనబడు చున్నదట. నేను రెండుయోగముల వ్రాసితిని. ఇంకను కుంకుమాదితైలయోగము లనేకములు కలవు. ఏయోగముతో పోల్చిన మార్పు కలదు? ఏయోగమున కాయోగమే సంబంధము. వైద్యవినోదిగారికి ఒకయోగము తెలిసిన మిగతయోగము లన్నియు ఆయోగమువలె నుండవలెననియా వారి అభిప్రాయము? ఎప్పుడును అట్లుండదు.

ఎట్టివారు గాని ప్రతివ్యక్తిని సంతోషపరప జాలరు. సుమారు అట్టి గ్రంథ మొండినను అనేక కారణములచే అనేకమందికి అనేక భావములు కలుగ వచ్చును. కాన ఒకవ్యక్తి మారుపేరుతో వ్రాసిన విమర్శన అంతగ పాటింప దగినది కాదని నాకు తెలియును. కాని జనసామాన్యము అంతగ గ్రహింపలేక, ప్రసిద్ధమగు భారతి పత్రికయందు ప్రకటింపబడుటచే ఆవిమర్శనము కొంతవరకైనను నమ్మెదరేమో యని సమాధానమును వ్రాసితిని.

ఆ॥ భి॥ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

## తెలుఁగు ప్రారంభవ్యాకరణము

క్రౌను సైజు, పు 17, వెల రు ౦-౩-౦. గ్రంథకర్త: సాహిత్యశిరోమణి ఉభయభాషాప్రవీణ కొండూరు నరసింహాచార్యులుగారు, బోర్డుమిడిల్ స్కూలు, కమలాపురము.

## శ్రీరామకథాంజలి (వచనము)

డిమ్మిసైజు, పు 225, వెల రు ౧-౮-౦, గ్రంథరచయిత్రి: శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు. ప్రకాశకులు: గుడిపూడి రామారావుగారు, గాంధినగరు, బెజవాడ.

Printed and Published by G. Subbaramayya, at the Andhra PatrikaPress, No.7,Thambu Chetty St., Madra s



తన్నుద్ధరించు పెద్దకొమారుఁ డేడ? నమ్మో! యంచు మన భారతోర్వి యేడ్వ
తన భాగ్యచంద్రుఁ డస్తమయించె హా! యంచు రాజమాత సురూపరాణి యేడ్వ
తన పితృదేవుఁ డంతర్ధాన మాయె నౌరా! యంచు నల పుత్త్రిరత్న మేడ్వ
తన కుడిబుజము కూలె నిఁ కేమి సేతు నన్నా! యంచు గాంధీమహాత్ముఁ డేడ్వ
తమకు నెవ రింక నయయొ! స్వాతంత్ర్యలక్ష్మిఁ-దెచ్చియిత్తు రనుచు భారతీయు లేడ్వ
అల్లహాబాదవినుసూర్యుఁ డస్తమించె-నేమి చెప్పుదు నమ్మ! కామేశ్వరమ్మ!

తన సర్వస్వము భారతావనికి స్వాతంత్ర్యంబుఁ జేకూర్ప న
ప్పనముం జేసిన దానవీరుఁడు, జగత్ప్రఖ్యాత మై యొప్ప రా
జ నయాకాశము నింతదాఁకఁ దన ధీ చాతుర్య తేజమ్ముచే
తను వెల్గొందఁగఁ జేసినట్టి బుధమార్తండుండు, గాంధీమహా
త్ముని సత్యాగ్రహనామకోద్యమము నామోదించి పల్మాఱు కృ
ష్ణుని జన్మస్థలి కేఁగినట్టి జనవంద్యుం డైన ధీరుండు, శాం
తిని యెల్లప్పుడుఁ గోరుపండితుఁడు, మోతీలాలు హిందూర్వి శు
గ్వనధిం గూలఁగఁద్రోచి తాఁ జనియె స్వర్గం బేలఁ గామేశ్వరీ!

# సాభిప్రాయ విశేషములు

పండిత మోతిలాలు నెహ్రూ మహాశయుడు గాంధిమహాత్ముని సత్యాగ్రహసహచరులం దగ్రగణ్యుడు. గాంధిమహాత్ముడు విరాగి. సబర్మతీతీరము నందలి సత్యాగ్రహాశ్రమము సన్న్యాసాశ్రమము. మోతిలాలు నెహ్రూగారు త్యాగభోగి. యమునాతీరమునందలి ఆనంద భవనము భోగాశ్రమము. సత్యాగ్రహ దీక్షయందు వైరాగ్యభోగములకు సంప్రాప్తమైన విశ్వాససాహచర్యములు ప్రపంచ ప్రవృత్తియందు పరమార్థ ప్రదములుగ నున్నవి. స్వరాజ్యసమరమునందు గతించిన పదేండ్లయందును గాంధిమహాత్ముని నామమువలెను మోతిలాలు మహాశయునినామమును సంస్మరణపాత్రమైనది. వర్తమాన సందిగ్ధసమయమునందు మోతిలాలుగారి నిర్యాణము దేశమంతను దుఃఖార్ణవమునందు ముంచివేసిన విధమును దేశావృతమైన సంతాపము విశదము చేయుచున్నది.

మోతిలాలుగారు సుప్రసిద్ధ న్యాయవాదులు. వేలకొలదిగ రూప్యముల నార్జించుచు స్వర్గభోగముల ననుభవించుచుండిరి. వారి ఆనందభవనము వారి పరిచితుల కందరకును అన్వర్థముగ నానందభవనమై వెలయుచుండెను.

గాంధిమహాత్ముడు 1920 సంవత్సరమునందు సత్యాగ్రహ ప్రస్థానము నుపక్రమించినపుడు మోతిలాలుగారు సహాయోద్యమనాయకుడై న్యాయవాదివృత్తిని తృణప్రాయముగను విసర్జించి పుత్రసహితముగను నిర్బంధము ననుభవించెను. విమోచనానంతరము వారవలంబించిన మార్గము ఖండనమండనములకు మూలమైనను వారిదృఢసంకల్పమునకును, దేశభక్తికిని, కార్యదీక్షకును నిదర్శనము. మోతిలాలుగారు నిర్మించిన స్వరాజ్యపక్షము శాసనసభలయం దవలంబించిన ప్రతిష్టంభనవిధానము నిరంకుశప్రభుత్వమును స్తంభనము చేయజాలకపోయినను జాతీయవాదుల రాజ్యాంగలక్ష్యము విశదము చేయగలిగినది. సామ్రాజ్యశాసనసభయందు పండిత మోతిలాలు నెహ్రూగారు స్వరాజ్యపక్షనాయకుడై చూపిన చాకచక్యము స్వాతంత్ర్యప్రియత్వము వారిప్రతిభను విశదము చేసినను స్వరాజ్యప్రయోజనములకు నిరర్థకమై స్వరాజ్యపక్షనాయకుని భ్రమనుతొలగించినది. దేశబంధు దాసుగారి మరణము హతశేషమైన భ్రమను నిర్మూలము చేసినది.

పండిత మోతిలాలుగారు శాసనసభాబహిష్కార వాదులతో ప్రతిఘటించినను కాంగ్రెసుపట్ల గల భక్తిమాత్రము భంగము గలుగలేదు. మోతిలాలుగా రవలంబించిన మార్గమునే మితవాదులును ఇతర సంఘాభిమానులును నవలంబించియుండిన భారతీయ

రాజ్యాంగ చరిత్రము భిన్నరూపమును దాల్చి నిరంకుశవర్గ మవలంబించెడి దాన భేద దండోపాయములు దురారాధ్యములై ప్రభుత్వ ప్రతిఘటనము సుకరమై యుండెడిది. నెహ్రూగారి శాసనసభానుభవము లాహోరు కాంగ్రెసు విజయమునకును, రెండవ సత్యాగ్రహ ప్రస్థానమునకును వినియోగపడిన విధమును 1930 సంవత్సర చరిత్రము విశదముచేయు చున్నది. మోతిలాలుగారి స్వరాజ్యకాంక్షను వారి యఖండ త్యాగము విశదముచేయు చున్నది. రాజ్యాంగసంస్కరణములవిషయమై తయారు చేయబడిన నెహ్రూనివేదిక వారి యఖండ ప్రజ్ఞకు నిదర్శనము.

మోతిలాలుగారు స్వయముగను త్యాగము నుశేయుటయేగాకను వారికుటుంబ త్యాగమునకు గూడ దోడ్పడి ఆనందభవనమును స్వరాజ్య భవనమును జేయగలిగిరి. వారి పుత్రుడు జవాహరిలాలుగారు లాహోరు కాంగ్రెసున కధ్యక్షులై యపూర్వగౌరవమును బడయగలిగిరి. శాసనోల్లంఘన ప్రస్థానము నందు తండ్రి, కొడుకు, కూతురు, కోడలు, అల్లుడు, మొదలగు బంధువులు నిర్బంధనివాసమును పరమానందముతో స్వీకరించియును ఆనందభవనమును కాంగ్రెసునకు ధారాదత్తము చేసియును మోతిలాలుగారు గాఢమైన స్వరాజ్యాభిలాషను పరిస్ఫుటముచేసిరి. కాంగ్రెసు చరిత్రయం దిట్టి యపూర్వ త్యాగముసుచేసి గౌరవమును బడసిన కుటుంబము వేరొకటి గనుపడదు. మోతిలాలుగారికి 70 ఏండ్లు నిండినను వారి స్వాతంత్ర్య ప్రియత్వము సరళస్వభావము, రాజనప్రవృత్తి భారతసభ్యత్వమునకు నిదర్శనములుగ నున్నవి. భారత జాతీయసౌభాగ్య నిర్మాణమునకు సాధనములైన సన్న్యాసరాజయోగములను వైరాగ్య భాగ్యయోగములను నిత్యజీవనమునందు సమన్వయముచేసిన మోతిలాలు నెహ్రూగారి జీవితము భారతీయులకాదర్శప్రాయమై స్వరాజ్య సంపాదనమునకు సాధనభూతముగా గలదు. చెరసాలయందు గనుపడిన వ్యాధి క్రమముగ వృద్ధియై మరణమునకు గారణమైనది.

ఆనందభవనము నందు జాతిమతముల భేదములు లేకను హిందువులు, మహమ్మదీయులు, శ్రీమంతులు, సామాన్యులు, స్త్రీలు పురుషులు, అతివాదులు, మితవాదులు స్వరాజ్య సౌఖ్యముల ననుభవింపగల విధమునకు నిత్య జీవనము ప్రత్యక్షప్రమాణముగ నుండెను. రాజకీయార్థిక సాంఘికమత భేదములను నిత్య జీవనమునందు సమన్వయముచేసి స్వరాజ్య లక్ష్యమును సువ్యక్తముచేసిన మోతిలాలు నెహ్రూగారు ధన్యులు. వారి దివ్యమైన జీవయాత్ర భారతీయులకాదర్శప్రాయమై స్వరాజ్య సిద్ధికి దోడ్పడుటకు భగవంతు డనుగ్రహించుగాక !

*    *    *    *

రాజకీయ నిర్బంధితుల విమోచనము

ఇర్వినుప్రభువు రామ్సెమాక్డొనాల్డు బెన్నుగారల ప్రసంగముల కనురూపముగను

గాంధిమహాత్ముని, కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యులను ఏ షరతులు లేకను విడుదలచేయుట యుక్తమైనను శాంతిస్థాపనమునకు నిరుపయోగము. జెయిలులందు 60,000 శాంతియోధులు నిర్బంధముల ననుభవించునపుడు, నిర్బంధ విధానము నిత్యవ్యవహారమైనపుడు, లాఠీప్రయోగము సామాన్యవిషయమైనపుడు శాంతి వాతావరణము గలుగజాలదు. నిర్బంధవిధానము యథేచ్ఛగా సాగుచుండగా పోలీసు దౌర్జన్యములు విచ్చలవిడిగా విజృంభించుచుండగాను నిరంకుశప్రభుత్వమునకు హృదయ పరివర్తనము గలిగినదని విశ్వసించుట కవకాశములు గలుగవు. ఇర్విను ప్రభువు తాను ప్రారంభించిన సామోపాయమును పూర్తి చేయుటకు ప్రశాంత వాతావరణమును గలుగజేసి గాంధిమహాత్మునకు రాజ్యాంగ విమర్శనలందు పాల్గొనుట కవకాశమును గలుగజేయుట పరమావసరము.

జయకరు సప్రూ శాస్త్రిగారులు మాతృభూమియందు కాలుపెట్టినకాలము నందే నెహ్రూగారు పరలోకమున కేగుటయును దురదృష్టముగ నున్నది. ప్రయాగయందు జనవరి 31 వ తేదిని కాంగ్రెసు కార్యనిర్వాహకసంఘము గూడినను భావికార్యవిధానమును నిర్ణయించుట దుస్తరమైనది. సప్రూ గాంధి గారల సంప్రతింపులు పూర్తియైన తరువాతను ఈ నెల 13 వ తేదిని తిరిగి కార్యనిర్వాహకసంఘము ప్రయాగయందు గూడుటయును, భావికార్య విధానమును నిర్ణయించుటయును సంభవము. సకలమును నంధకారబంధురమై నిరాశాజనకముగ నున్నది. ప్రపంచ పరిస్థితులును విపరీతాకృతిని దాల్చుచున్నవి. ఈ సందిగ్ధసమయమునందు కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘము స్వధర్మనిర్వహణమును జేసి కామితార్థముల బడయుటకు భగవంతు ననుగ్రహము గలుగుగాక!

---

Printed and Published by G. Subbaramayya, at the Andhra PatrikaPress, No.7, Thambu Chetty St., Madras,



ఠాడీ పక్షీ టేక ద్వార దురాకే పకిలవాల తో బిరహో దుమసానీ,
అంగ వి డాలిజ భాతి సదా చిత్రమే అతిహీ పియు చిత హింఆనీ,
రాజతి మహా కుఛిలా వి ఖురీ అతపమారు ప్రసూనవనీజానీ,
శ్రీరాగకీ రాగనీ పూరబీ ఐహీ అపూరబ బరూప బఖానీ.

[జయపుర చిత్రము : దివాన్ బహదూరు గోవిందదాసు చతుర్భుజదాసు గారి యనుమతిని]